జనకరాగ

# కృతిమంజరి



గానసుధాకర

మంగళంపల్లి బాలమురళీకృష్ణ

రు 4-0-0

# కృతి సమర్పణ

విజయవాడ దుర్గాపుర నివాసిని,

మత్పరాంబికయగు శ్రీ కనకదుర్గకు

నీ జనకరాగ కృతిమంజరిని

సమర్పించుచున్నాను.

శతావధాని, మహోపాధ్యాయ
మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులు

అగ్రహారం
గుంటూరు

# తొలి పలుకు

శ్రీమన్నంబగు భరత ఖండమున గానకళను దొల్లి నారదాది మహర్షులును, పిమ్మట మహర్షితుల్యులగు పురందర దాసాది మహామహులును బాగుగ నభివృద్ధికిఁదెచ్చి, అనేక గేయముల నొనర్చి స్వరూపానందానుభవ రూపమగు యథార్థఫలమును సంపాదించి జీవన్ముక్తులై నేటికిని, ప్రతి భారతీయుని హృదయాకాశమునందును రాహుకేతువుల కందని సూర్యులై వెల్గుచున్నారు.

వారందరిలో నేటి మనకత్యంత సన్నిహితులైన శ్రీ త్యాగరాజు గారు గొప్ప ఆదర్శపురుషులు. వారు శ్రీ వాల్మీకి మునివలె నారదోపదిష్టులై శ్రీరామకథను బహువిధ భావములతో బహువిధ రాగామృతముతో భావనచే భారతీయుల ననుభవింపఁజేసిన గాయక చక్రవర్తి సార్వభౌమ శిరోమణులు. వారి గానభారతిని, గేయకవితా భారతిని నెన్నాళ్ళు విమర్శించి చూచిననూ నొకదానికంటె నింకొకదాని యందు విశేషము సహృదయులకు గోచరించుచునే యుండును. ప్రస్తుతమునఁగూడ వాగ్గేయకారకులున్ననూ వారందఱును, శ్రీ త్యాగరాజ భాస్కరుని ముందు విద్యుద్దీపములో, ఆమిదపు దీపములో, మినుగురు పురుగులో యని చెప్పవలసినదేగాని శ్రీ వారితో త్రాసునఁదూగఁజాలరు. శ్రీవారికి అంత స్థితి వచ్చుటకు గారణము వారి వేదవిహిత సత్కర్మానుష్ఠానమును, ప్రాకృత విషయములందు విరక్తియు, శ్రీరామునియందవిచ్ఛిన్న భక్తియు నైయున్నవి. కావుననే ఆమహామహుడు,

ఉ॥ పూజ్య చరిత్రులైన నృప, పుంగవులెందఱో వచ్చి "మీకు మా
రాజ్యము నిత్తు" మన్నను నిరంతర భోజ్యము రామభక్తి సా
మ్రాజ్యమె మాకుఁగాని యిఁక రాజ్యము గీజ్యము భోజ్యమానె సం
త్యాజ్యమె పొందు పొందనిక, ధన్యుఁడు త్యాగయమర్త్యమాత్రుఁడే!

ప్రకృత కాలమున గాయకులలో బహుత్ర స్వవిహితకర్మానుష్ఠానమును, భక్తియుఁజాల తక్కువై తమ గానమును ద్వితీయ పురుషార్థము కొఱకు మాత్రమే పర్యవసాన మొనరించుట గన్పట్టుచున్నది. ఇప్పుడైనను నూటికో

నను మైనాక్షి గడచెనో! లేదో! అనుకొనునంతటి వయస్సులో నీ గ్రంథమును వ్రాయఁగల్గెను. శ్రీ త్యాగరాజాంశ కొంతవరకితనియందున్నట్లు మన మూహింపవచ్చును. ఇది అతిశయోక్తిగా చదువరులనుకొననక్కఱలేదు. చక్కఁగా బాడగల్గిన గాయకులనుగూడ "వీడు గంధర్వాంశను బుట్టినాడు" అని సులభముగా లోకులనుకొనుట సర్వానుభవ సిద్ధమే. శ్రీ త్యాగరాజు గారు మున్నగు వారుగూడ మేళకర్తరాగములలోఁ గృతులఁ వ్రాసిన వ్రాసి యుండవచ్చును. కాని ప్రత్యేకము మేళకర్త రాగముల కొఱకే అవి వ్రాయబడి యుండవు. ఈ బాల మురళీకృష్ణుఁడు మేళకర్తరాగములలోనే బాగుగ నభ్యాసము పాఠకులకుఁ గల్గింపజేయఁదలఁచియే యీ గ్రంథమును వ్రాసెను. నేనుగూడ దానికి దగినట్లు మేళకర్తలలోగూడ సరళి మొదలు అటతాళవర్ణముల వరకు లక్షణగ్రంథము వ్రాయుమని ప్రోత్సహించితిని. గాన నితని గ్రంథములను చదివి, పాఠకమహాశయు లెల్లరు, గానకళకొక క్రొత్తయందమును బెట్టుదురు గాక. శ్రీ త్యాగరాజుగారు ఆంధ్రులైయ్యు, తమిళదేశమున బుట్టియు, ఉభయదేశములను యశోధనవంతముల నొనర్చెను. ఈ నవీన త్యాగరాజు సర్వవిధముల నాంధ్రదేశీయు డగుటచే నితని ద్వారా మన దేశము అధిక కీర్తి ధనవంతమగు గాతయని పరమేశ్వరు నాశించుచుంటిని.

కాశీ కృష్ణాచార్యులు.
శతావధాని.

కవిసామ్రాట్ విజయవాడ.
విశ్వనాథ సత్యనారాయణ, *M. A.*

ప్రధానాంధ్రోపన్యాసకులు

యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కళాశాల

# పీఠిక

ఈ గ్రంథ రచయిత చి॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ. బాల మురళీకృష్ణ పేరెరుగనివారు తెలుగు దేశములో సంగీత ప్రపంచమున నెవ్వరుండరు. ఇతడు పసితనములోననే పూర్వజన్మకృత బహుసుకృత విశేషమున విద్వాంసుడయినాడు. అతనికి పది పన్నెండు సంవత్సరములు రాకమున్నే పెద్ద గానసభలు చేసెను. బహుసన్మానములు పొందెను. గాయక శిరోమణులుకూడ మురళీకృష్ణని చేతులలో నెత్తుకొని లాలించి గౌరవించిరి. చిన్నతనములోనే యిట్లు ప్రతిభాసించిన విద్యలు వయసు వచ్చినంతనే వానిదారి నవిపోవును. దానికి కారణము, భగవంతుడిచ్చిన ప్రతిభ శాస్త్రపరిష్కృతము కాకపోవుట. ఈతనియందట్లుకాక భగవద్దత్తమైన ఈవిద్య గాయక సార్వభౌములైన శ్రీ కీ॥ శే॥ పారుపల్లి రామకృష్ణయ్యపంతులుగారివద్ద చేసిన శుశ్రూషా విశేషమువలనను, ఇతని పితృపాదులైన శ్రీ మంగళంపల్లి పట్టాభిరామయ్యగారి వాత్సల్యయుత బోధనా విశేషముచేతను, శాస్త్రోపల నికషమును పొంది దేదీప్యమానముగా ప్రకాశించుచున్నది. చి॥ మురళీకృష్ణయొక్క ప్రతిభయు, శాస్త్రజ్ఞానము, నిత్యాభ్యాసము, పండి సముద్భవించిన దీ గ్రంథము. గాయకునియొక్క శక్తికి కృతులు రచించుట యవధిభూతమైనది. కర్ణాటకసంగీతమున 72 మేళకర్తలైన రాగములు కలవు, 12 చక్రములు, చక్రమున కారు పా, శ్రీ, గో, భూ, మా, షా లు వీని సంజ్ఞలో, ఈమేళకర్తల యందు కర్ణాటకగానపరమేశ్వరులు శ్రీ త్యాగరాజస్వామివారు కృతులు వ్రాసియేయుందురు. అన్ని మేళకర్తలకును, శ్రీ త్యాగరాజ కృతులు కనిపించుట లేదందురు. శ్రీ మురళీకృష్ణ నేడాలోపమును పూరించెను.

నాకు సంగీతశాస్త్ర పరిజ్ఞానమేమియు లేదు. మహావిద్వాంసులు పాడగా వంశులాది కచేరీలు వినుటవలన కలిగిన యొక రసజ్ఞత యున్నదేమో! అట్టి నన్ను గ్రంథమునకు పీఠిక వ్రాయుమని యడిగిన ఈ తండ్రి కొడుకులకు నాయందున్న ప్రేమయే కారణము. ఆ ప్రేమకు ప్రబలోదాహరణము నేను మురళీకృష్ణను చిరంజీవి యనుటయే.

కృతులను రచించుట యనినతోడనే దానియందు కావ్యత్వము ప్రవేశించుచున్నది. అదృష్ట్యా ఈ కృతులను పరామర్శించుటయే నేను చేయగలిగినపని. కృతులను రచించుటతోడనే గాయకుడు కవికూడ యగుచున్నాడు. అతని కవితాశక్తి ఎట్టిది అను ప్రశ్న పుట్టుచున్నది. కవిగా అతని ప్రాభవ మెట్టిదను ప్రశ్న పుట్టుచున్నది. ఇందు కొన్ని కృతులు తెలుగులో వ్రాయబడినవి. మరికొన్ని సంస్కృతమునందు వ్రాయబడినవి. శ్రీ త్యాగరాజ కృతులు మినహాయించినచో తక్కిన వారు వ్రాసిన కృతులయందు భావసమృద్ధి తక్కువగానుండును. ఆకృతి ఏ దేవత నుద్దేశించి వ్రాయబడినదో తద్దేవతా సంబోధన బాహుళ్యముండును. ఆ సంబోధనల యందు మధుర శబ్దజాలము నుపయోగించుటకూడ కవితాశక్తి కానుటకు వీలులేదు! మధురశబ్ద సంయోజనమాత్ర శక్తివంతులు తెలుగులో నెంతమంది కవులు కాలేదు? ఈ కృతులలో చాలభాగ మట్టివే. అంతతో ముగిసినచో వ్రాయవలసిన దేమియు నుండెడిది కాదు. అంతకు మించినయొక ప్రతిభ, కవియొక్క భావనా విశేషము ఇతనియందు కనుపించుచున్నది.

అనాదినుండియు, పదకర్తలయందును కృతికర్తలయందును తమ రచనల యందు తమ పేరును సంయోగపరచుకొనుట సర్వభారత దేశమందును కనుపించుచున్నది. ఈయనకూడ సర్వకృతులయందు తన నామ సంయోజనమును చేసినాడు. ఈ నామసంయోజనము మూలముగా సర్వదేవతలు మురళీగాన విలాసులే అయినారు. ఇట్టి పలుచోట్ల మురళీకృష్ణుడైన తనయొక్క సంగీతప్రియము లాదేవతలని చెప్పవలయును. అందుచే ప్రధానముగ భక్తిభావమునకే యుపపత్తి కలుగుచున్నది. ఏడవ కృతిలో "మురళీభక్తరక్షక" యని ప్రత్యక్షము

గానే చెప్పబడినది. 11 వ కృతి శ్రీకృష్ణ పరమైనది. అచ్చటమాత్రము "మురళీగాన సుధారసాస్వాద" అన్న సంబోధనము నామ సంయోజనమునకు నామ సంయోజనము. "శ్రీ రాధామనోహర" సంబోధనము చక్కగా సరికినది. "మురళీకృష్ణాది గాయక ప్రియకరం" అన్న 13 వ కృతిలోని సంబోధన ఈ తాత్పర్యమును వ్యక్తీకరించుచున్నది. 29 వ కృతిలో "ప్రసిద్ధ మురళీగాన మధు ప్రియం" శ్రీ సుబ్రహ్మణ్యస్వామికి విశేషణములో కృతికర్త తాను ప్రసిద్ధుడననికూడ చెప్పికొనుచున్నాడు.

కొన్ని కృతులలో రాగములయొక్క నామములు పొదిగి వ్రాయుటయు, గాయకులు వానిని పాడునపుడా రాగములతోనే పాడుటయు ప్రసిద్ధమైన విషయము. ఇందు 14వ కృతి వకుళాభరణ రాగము. 17వ కృతి సూర్యకాంతరాగము. 57వ. కృతి సింహేన్ద్ర మధ్యమము. 62వ మేళకర్త రిషభప్రియ. ఈ నామములు సంయోజింపబడుటయే గాక 62. వ కృతి పాడునపుడు, సందర్భానుసారస్తుతి చేయుట విశేషమైన విషయము.

పూర్వమందు కృతికర్తలు పలువురు కలరు. వారి యందరిలోనను, ఈ గాయక కవిశిరోమణియందు మాత్రమే అమిత గౌరవము. ప్రథములు శ్రీ త్యాగరాజస్వామివారు. ద్వితీయులు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు. వీరి యిద్దరియెడల ఇతనికిగల గౌరవములో చాల భేదము కలదు. ఇతనికి శ్రీ త్యాగరాజులవారు తామసాదిగుణరహితుడు, తత్వజ్ఞుడు, త్యాగవిదుడు, యోగవిదుడు, యమిశివరుడు, సద్గతిప్రదాయకుడు. ఈ కృతి 8వ మేళకర్త. త్యాగరాజు సద్గతి ప్రదాయకుడట. నాదోపాసనచేత తరించుటయు తిన్నానదోపాసన త్యాగరాజోపజ్ఞమగుటయు నిందు ధ్వనితములు. శ్రీ ముత్తుస్వామి దీక్షితులను గురించి ఈతని భావమట్లు లేదు. అది 67వ కృతి. ఆయన యుపాసనాపరుడు, అపారరాగ లయాభిజ్ఞుడు, మార్గదేశీయగాననిపుణుడు అంతే.

తెలుగులో వందలాది పదకర్తలున్నారు వేలాది కీర్తనకర్తలు ఉన్నారు. కృతికర్తలు కొద్దిమంది. తెలుగుభాషలో కృతివ్రాసెడిసొంపు

శ్రీ త్యాగరాజస్వామివారి కొక్కరికే తెలియును. ఈమాట సంగీత విషయికమైనదికాదు. పట్టి తెలుగుభాషా విషయమైనది. ఒక్కకృతియైనను శ్రీ త్యాగరాజులవారి భాషాపాకమునకు సన్నిహితముగానున్నదని చెప్పుటకు వీలైనచో నా కృతికర్త చరితార్థుడే.

ఈ గ్రంథములో 32వ మేళకర్తకు వ్రాసినకృతి యచ్చముగా శ్రీ త్యాగరాజస్వామివారి వాక్కువలెనున్నది; "ఆ నారదహనుమదాదు లనవరతముపాసించే గానసుధారసమే పరమానందదాయక మో మనసా" ఇవి అనుపల్లవి, పల్లవి. "ఆనారద !" ఈతచ్ఛబ్ద ప్రయోగము సంపూర్ణముగా శ్రీ త్యాగరాజులవారి ముద్ర.

ఇందందదమైన పలుకుబళ్ళుకలవు. పూర్వభాగము తానవర్ణములో "ఆలసింప సొంపా! మురళీధర!" అనుట సొగసుగానున్నది. 16వ మేళకర్తలో "భుజగసహిత నీలకంఠ" యనుట రమ్యముగ నున్నది. 31లో "ఎలబిలసఖ!" 35లో 'మనోన్మని' 64వ మేళకర్తలో 'నతాళీప్సిత వరప్రదా" మొదలయిన ప్రయోగములు పాండిత్య స్ఫోరకములుగా నున్నవి. 25వ మేళకర్త సంపూర్ణముగా సంస్కృతభాషలో వ్రాయుబడినది. తృతీయావిభక్తులు చివరిదాక సమర్థింపబడి శ్రీ కృష్ణ దేవుని "మారరంజిత మానసేన" అనుట సుకుమారముగా నున్నది.

ఈ గ్రంథము వయసుచేత చిన్నవాడైనను విద్యచేత నాంధ్ర దేశస్థ గాయకవతంసులలో నొకడైన చి॥ మురళీ కృష్ణకు కీర్తిపతాకయే గాక పరమేశ్వరుడితనికి చిరాయురారోగ్యాది సమస్త వైభవములు సమకూర్చుగాత!

విశ్వనాథ సత్యనా

His Holiness
Sri Paramahamsa Parivrajakacharya
SRI VIMALANANDA BHARATHI SWAMIGAL
Siddeswari Peetadhipathi

Dattatreya Mandiram,
COURTALLAM
(Tenkasi Taluk)
Camp: ***GUDIVADA***
Krishna Dt.
31—8—1948

ఈ కీర్తనలను వ్రాసిన మురళీకృష్ణుని చిన్నతనముననే యెరుగుదును. తొమ్మిదవయేటనే పాటకచ్చేరిచేసి ప్రతిభ గాంచిన అద్భుతశక్తిసంపన్నుడు. తిరికి తన సంగీతశాస్త్ర పాండిత్యమునకు తగినట్లు కృతులు రచించి ఆంధ్రభాషకు వన్నె తేగలడని ఆశించియుంటిని. ఇవి - ఈ చిన్నవాని ప్రథమ పదరచన - అతి ముదావహాము. ఇతోధికముగ - ఆరితేరిన భావగాంభీర్యముతో - ఇంకను వ్రాయగలడని - అశీర్వదించుచున్నాము.

ఇవియే నారాయణ స్మృతులు.

(సం.) విమలానందభారతీస్వామి

పింగళి లక్ష్మీకాంతం

వాల్తేరు
7—9—51

# అభిప్రాయము

శ్రీ. గానసుధాకర, బాలమురళీకృష్ణగారు రచించిన సంగీత కృతులను, నేను గేయకవితా ఖండములుగా చదివి మిక్కిలి ఆనందించితిని.

ఆ రచనా సౌందర్య సౌలభ్యాదులను చూచి వీరికి, సంగీతమువలె, కవిత్వముగూడ, తనంత లభించిన ప్రాక్తన జన్మవిద్యా కాబోలు నని ఆశ్చర్యపడితిని.

ఈ కృతులు, త్యాగరాజు కృతులవలె, దేశమెల్లెడల గానము చేయబడవలెననియు, త్యాగరాజువలె, మురళీకృష్ణ గారును ఉత్తమ వాగ్గేయకారుడుగా ప్రసిద్ధికెక్కవలెననియు కోరుచున్నాను.

(సం) పింగళి లక్ష్మీకాంతం

కవికథారత్న

పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాస భాగవతులు,

నరసాపురం.

# మంగళాశాసనము

శ్రీ లావణ్య విలాసలాలసుఁడు వంశీవాద్యహృద్యద్రవో
ద్వేలానంద ధునీరసోజ్వలుఁడు సర్వేషాం శ్రితైషిణ్యభా
వాలంకార విభూషితాత్ముఁడు కృపాయత్తైకశీలంబునన్
గేలున్ గేలునఁగల్గి బాల మురళీకృష్ణున్ సదా ప్రోచుతన్.

సరసోద్యత్కవితావిభూతి, విలసత్సంగీత సాహిత్యముల్
భరతామ్నాయ విశిష్టతల్ సహజ విద్వచ్ఛోభ నొప్పన్ గళా
భరణానూన యశోరుచిన్ బొరయు మా వాగ్గేయకారుండు శ్రీ
మురళీకృష్ణుఁడు పూర్వజన్మసుకృతాంభోరాశి రత్నంబగున్.

పరమోత్కృష్ట కళాప్రపూర్ణుఁడు స్వర ప్రస్తారమాదున్ సరి
ద్వరుఁడు త్తీర్ణుఁడు వాయులీన మృదువాద్యస్ఫూర్తి మార్దంగిక
స్ఫురణన్ భృంగియె, కీర్తనారచన కొప్పున్ సాటిచెప్పంగ మా
మురళీకృష్ణుఁడు శ్యామశాస్త్రికి యశంబున్ గొల్ప నాంధ్రాళికిన్.

చిరంజీవి శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ రచించిన "జనకరాగ కృతి మంజరి" అను గ్రంధమును చూచి బ్రహ్మానందభరితుఁడనైతిని. సంగీత సాహిత్యము లవినాభావ సంబంధమును వెలార్చి గ్రంథకర్తకు "సహజ వాగ్గేయకారరత్న" బిరుదమందించు తద్రచన ఆంధ్రసంస్కృత సారస్వత గేయమణి మంజూషయై బుధానందకల్పకమై యలరారుననుట అతిశయోక్తి కానేరదు. పదియవ యేటనే పల్లవి బాడనేర్చిన మా బాల గంధర్వుని ప్రతిభావిశిష్టత కది ప్రతిలేని అమూల్యాభిజ్ఞ.

తెలుఁగు తల్లి గొడ్డురాలు కాదని ప్రపంచమునకు చాటిచెప్పి ఆంధ్రలోకమునకు గర్వకారణుఁడైన బాల మురళీకృష్ణున కాయురారోగ్య భాగ్యములొసంగి శ్రీయః పతి సర్వదా కాపాడుగాక! ఇతోధిక గ్రంధరచనకు బ్రోత్సహించు గాక!

"దీక్షితదాసు"

టి. యస్. పార్థసారథి, మద్రాసు,
డి. టి. యస్. (M. S. M. RY.) 8 ఆగష్టు, 1950

మొట్టమొదటి సారిగా, 72 మేళకర్త రాగాలన్నిటిలో రచింపబడిన కీర్తనావళిని సంగీత ప్రియులముందు నామిత్రుడు విద్వాన్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ వుంచబోయే సందర్భంలో ఈ సంగ్రహవాక్యాలను వ్రాయడానికి నాకు చాలా సంతోషంగా వుంది. దక్షిణాభారత సంగీత విద్యా ప్రపంచానికి ఈయనను క్రొత్తగా పరిచయం చేయవలసిన అవసరంలేదు. సంగీత విద్యావ్యాసంగంలో బాలవిజ్ఞానిగా ఆరంభించిన ఈయన నమ్మకానికి అసంభవమైనరీతిగా, తొమ్మిదేండ్ల పూర్ణవిద్యా ప్రదర్శనమునిచ్చి, పల్లవిని పాడినాడు. ఆనాడే యీతనికి గల స్వర ప్రస్తారజ్ఞానాన్ని చూచి సంగీతములో విద్యావృద్ధులైన వారే ఆశ్చర్యపడినారు. ఇతడు యిప్పుడు ఒక సరళమైన యువకుడైనాడు, ఇతని సంగీతం ప్రసిద్ధులైన గురువర్యులు శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి శిక్షణతో ఇంకా పాకానబడి దృఢత్వాన్ని, హుందాతనాన్ని పొందింది.

పదునెనిమిదియేండ్లు రాకముందే 72 మేళకర్తలలో కృతులను రచించిన ఈయనకు వేరే యోగ్యతాపత్రము లనవసరము. అయినా ఏ మహావైద్యనాథ అయ్యరు, కోటీశ్వరయ్యర్ వంటి మహా విద్వాంసులు కొద్దిమందిచేసిన ఘనకార్యాన్ని, ఈ యువకవిద్వాంసుడు చేశాడంటే, సంగీతవిద్యా ప్రపంచానికి యిది సాహసంగా కనపడవచ్చు. నేను స్వయంగా ఈ కృతులను బాల మురళీకృష్ణ పాడగా విన్నాను; ముఖ్యంగా సుచరిత్ర, రాగవర్ధని, ల లోని కృతులను ప్రత్యేకంగా విన్నాను. అతి కష్టమైన ఆరాగాలలో కృతులను ఈయన అత్యద్భుతమైన ప్రతిభతో రచించియున్నాడు. ఆంధ్రభాషలో ఈయనకున్న ప్రవేశము, సంస్కృతముతో యున్న పరిచయము తగిన విషయాలమీద ఉచితమైన సాహిత్యాన్ని సృష్టించడానికి వీలు కలుగ జేసినవి.

ఆంధ్రదేశంలో సంగీతం, తగిన ఆదరణనూ, అభిమానాన్ని పొందడంలేదని అంగీకరించిన సమయంలో ఇటువంటి రచనల ప్రకటన, సంగీతాభివృద్ధికాముకు లందఱికీ స్వాగతమిచ్చే విషయం. ఈ యువక విద్వాంసుడు తన కృషిలో సంపూర్ణ విజయం పొందవలెననీ, దుర్గాదేవి యనుగ్రహం కలుగుగాక! యని ఆశిస్తున్నాను.

(సం) టి. ఎస్. పార్థసారథి.

—

శ్రీ దుర్గామల్లేశ్వర దేవస్థానము    దుర్గాపురం
విజయవాడ

ఈ గ్రంథకర్తను గురించి పలువురు విద్వాంసులు, పండితులు ఇచ్చిన వారివారి యభిప్రాయములు యిందు పొందుపరుప బడినవి. పైతరగతికి జెందినవాడను గాకున్నను యీ బాలకవితో చిరకాలముగ పరిచయము గలవాడ నగుటచే శ్రీ దుర్గామల్లేశ్వరుల ప్రేరేపణచే కొలది భావములు యిందు ప్రకటించుటకు సాహసించినందులకు కవి గాయకులు మన్నింతురు గాక!

ఈ బాలకవి తనకు తొమ్మిదవ వత్సరప్రారంభమున యీదుర్గా మల్లేశ్వరులకు అంకితుడై బహిరంగసభయందు గాన ప్రదర్శనములకు వేదిక నెక్కి మొదటిసారిగా శ్రీ దుర్గాదేవి శరన్నవరాత్రోత్సవములందు విజయదశమి నాడు తన గాత్రపాట కార్యక్రమము, 3 గంటల కాలము ప్రదర్శించి, శ్రోతల నోలలాడించుటకు ముఖ్యకారణమైన తన వయస్సు మించిన పల్లవిపాట, స్వాతంత్ర్య స్వరకల్పనలతో నచ్చెరువొందించెనని చెప్పుట నతిశయోక్తికాదు. ఈ బాలకవి, నాటి ప్రదర్శనఫలము తన శక్తిసామర్థ్యములకు మించిన దగుటచే నాటి సభాధ్యక్షులైన శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు యీ బాలుని గానప్రదర్శనమును గురించి మిక్కిలి ప్రశంసించగా, దానికి సమాధానముగ యిదియంతయు తన స్వప్రయోజకత్వము గాదనియూ, గాన ప్రియమైన శ్రీ దుర్గాదేవియే తనయందు ప్రవేశించి తానే పాడుకొని, శ్రోతల రంజింపజేసి తత్కీర్తి నిమిత్తమాత్రముగా ఆతల్లి తనకొసంగినందులకు, యావజ్జీవితము యామెకే తాను నిజభక్తుడనని జవాబొసంగిన యీ బాలమురళీకృష్ణుడు నాటినుండియు, ఆతల్లికి అచ్చంపు భక్తితో సేవలనొనరించుచూ వచ్చెను.

ఈ బాలగాయకునికి నాటినుండియు, వయస్సుతో బాటు ఆ తల్లియందు భక్తియు, పెరుగసాగెను. యీ రెంటితో బాటు బుద్ధిబలము గూడా పెరుగుటచే నాదబ్రహ్మోపాసన ఆ తల్లి యనుగ్రహముచే వాయులీన (Violin) వాద్యముగూడ ప్రారంభింప ఆ తల్లి ప్రోత్సహించెను. అందు ఎంత విద్యావంతుడైనదీ యందపరచితుడనైన నాకు

సారము చెప్పవసముగాదు. గాని నేనెఱిగినంతవరకు, దాక్షిణాత్యులలో అరియకుడి రామానుజ అయ్యంగారు, G. N. బాలసుబ్రహ్మణ్య అయ్యరు మొదలైన విద్వాంసులకు ప్రక్క వాద్యమును, వారే కోరి పిలిపించుకొనగా, వాద్యమును ప్రదర్శించి, వారి ధాటీకి నిలవగలుగుట యేగాక, యీ బాలుడుచూపిన మిక్కిలి గొప్ప ఉత్తను అనువర్తనము నకు, వారే యెంతెయో సంతసించి మెప్పులు సభలలో బల్కిరి. ఆ సాక్ష్యమాధారముగ, యీ వాయులీన విద్యయందును, యీబాలుని ఉత్తమ స్థానమునకు ఆతల్లి చేర్చెనని నావిశ్వాసము.

పిమ్మట ఆతల్లియందు భక్తిమెండయినకొలదీ, ఆతల్లి కథలు వినుట, పాడుట, వ్రాయుటలతో ఆతల్లిని సేవింప సాగింప కవితాధోరణి యున్నా, నాటినుండియు పోతన పద్యము శ్రీరామచంద్రుడు వ్రాసినట్లు కవనమందు యీ బాలునికి యోచనలు తోచినపట్ల ఆతల్లియే వ్రాయిం చుచు, వ్రాయుచు అనుగ్రహింప దొడంగెను. ఇందు ప్రవేశ మెక్కు వైనకొలదీ, యీ సంగీత సముద్రమునందుగల తుదిమొదలులేని అలల ధ్వనులవంటి భీకరమైన హుంకార ఝుంకారములతో యీ బాలుడు మృదంగ వాద్యమునుగూడ తనకైతాను అభ్యసింప ప్రారంభించి కొలది దినములకే తన గురువుగారైన శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారిక్కి కొన్ని పెద్దకచేరీలయందు వాయించి, పెక్కు దేశము లలో విద్యాప్రదర్శనము లిచ్చి పలువురు మహా పండితుల మెప్పులను బొంది సన్నుతులు బడసెను.

ఇట్లు తన జీవితమునకు భక్తి ప్రాధాన్యతయిచ్చి యుపక్రమించిన ఆంధ్రకవితా కార్యక్రమమునకు తోడు గీర్వాణ కవితాకన్యక గూడ వరించెనా! యనునట్లు గీర్వాణ కవిత్వము గూడా వ్రాయించ ఆ తల్లి యనుగ్రహించెను. ఇట్లు యీ యుభయకన్యలచే వరింపబడిన యీ బాలునికి పదునేడవ వత్సరప్రాయమున సటీర్ష్యలేని సాధ్వి ప్రియాగ వారివంశమునందుద్భవించి యొక్క మానవకన్య వరించి యీవంశము మెట్టి, చేపట్టి ఆ తల్లి తన యనుగ్రహానిదర్శనమా యనునట్లు ఈ యుభయ బాలదంపతులకు తానే బిడ్డయై బుట్టి వీరిసేవలనంది తన

యనుగ్రహమునకు పాత్రులజేయు, ముచ్చట గలిగి జన్మించిన యీ దుర్గారూపమైనకన్య నేటికి వత్సరద్వయ వయస్సుగలిగి నింట నలరారుచు ప్రేమించి ప్రేమింప బడుచున్నది. ఇట్టి దేవీయనుగ్రహమునకు పాత్రులైన మన తెనుగుదేశమందిప్పటికి ఏవొక వ్యక్తికి సాధ్యముగాని గాత్రగానము, ఫిడేలు, మృదంగ వాద్యములందున్నత గౌరవస్థానములంకరించుటయేగాక ఉభయకవితా గౌరవముగూడ బొందిన యీ వాగ్గేయ కారకునకు, ఇంక ఏది యసాధ్యమో వ్రాయుటకు నాకు శక్యముగాదు. గాన వీనినిన్ని వీనికి అతి బాల్యమునందు మాతృవియోగము గల్గిన నాటినుండియు, పెక్కు కష్టములకోర్చి పెంచిన పెద్దతల్లి యగు సుబ్బమ్మ, తండ్రియైన పట్టాభిరామయ్యగార్లనున్ను ఆతల్లి సర్వ విధముల గాచిరక్షించి మహాపండితుల ఆశీర్వాదమునకు వీనిని పాత్రుని జేసి చిరాయురారోగ్యము భక్తి జ్ఞానవైరాగ్యములు గలుగజేయునని గోరుచు, గ్రంథవిస్తరణ భీతిచే నింతట విరమించుచున్నాను.

ఇట్లు,

(సం.) బేతపూడి వీరశరభయ్య.

దేవస్థానం స్థాపకులలో నొకడు, బుధజనవిధేయుడు.

**T. S. PARTHASARATHY**
D. T. S. (*M. S. M. Ry.*)

MADRAS
8—8—50

It gives me great pleasure to write these few lines in appreciation of the collection of 72 Mela Karta Raga Kritis which my young friend Vidwan Mangalampalli Bala Murali Krishna is now placing before the music-loving public for the 1st time. He needs no introduction to the music world in South India. Commencing his musical career as a boy prodigy, he started giving full-fledged performances with Pallavi singing at the incredible age of nine years. His mastery over swara-singing at that early age surprised even veterans in the field. He has now grown up as an amiable young man and his music, under the able guidance of his Guru, Sri Parupalli Ramakrishniah Pantulu Garu, has gained maturity, firmness and polish.

No further testimony of his musical precocity is necessary than his composing of kritis in all the 72 Mela Karta Ragas before he attained the age of eighteen. The music world may consider this as a rather ambitious attempt on the part of the young musician, as the feat has so far been performed only by a few eminent musicians like Maha Vaidyanatha Iyear and Kotiswara Iyer. I have personally heard Bala Murali Krishna render several of these kritis, notably those in Sucharita and Ragavardhani and have no hesitation in saying that, difficult as the task is, the vidwan has accomplished it with remarkable ability. His proficiency in Telugu and his acquaintance with Sanskrit have enabled him to compose suitable sahityas on appropriate themes.

It is common knowledge that music is not having, in the Andhra Desa, the support and interest it so richly deserves and the publication of works like these will, therefore, be welcomed by all interested in the development of music. I wish the young vidwan all success in his endeavour and the grace of Goddess Sri Durga Devi.

(*Sd*) T. S. Parthasarathy.

సాహిత్య విశారద, విమర్శక శిరోమణి,
కోన వేంకటరాయశర్మ,
కార్యదర్శి, ఆంధ్ర సారస్వత పరిషత్తు.

నాగేశ్వరపురము,
బాపట్ల.
౨౯-౧-౧౯౫౭.

గానసుధాకరా!

ఆశీర్వాదములు —

★ ★ ★

... రసమయ జగత్తునందుఁ గవియొకఁడే యనన్య సామాన్య తేజోవంతుఁడై విలసిల్లునని యగ్నిపురాణ మందలి

"నరత్వం దుర్లభం లోకే విద్యా తత్రచ దుర్లభా,
కవిత్వం దుర్లభం తత్రశక్తి స్తత్రచ దుర్లభా"

అను వాక్యమున కుద్దిష్టమై జగత్కల్యాణ సంధాయకంబగు 'కృతిమంజరి' యను నీ యుత్తమ గ్రంథమును రచించిన నీకు మనఃపూర్వకాశీస్సులు. ఇందలి ప్రతికీర్తనయు నీ యుపజ్ఞను జాటుచున్న దనుటకు సందియము లేదు.

ఆత్మ సంస్కారము గలవారిని లోకమెఱింగినను ఎఱుంగకున్నను పుష్పవాటిక యందలి సుసౌరభము బలె వారిశక్తి వెలికుద్గమించును. వారి మహత్త్వము బాల్యము నుండి సువ్యక్తమగుచుఁ దుదకు మహోన్నత స్థితికి వచ్చి తేజోవంతమై లోకమును రంజింపఁ జేయును. అనేక జన్మ సంసిద్ధి వలన 'స్వయంతీర్ణః పరాన్ స్తారయతి' యను నార్యోక్తికి లక్ష్యభూతులు గాయకసార్వభౌముఁడును, వారియంతేవాసియగు నీవును కవితా వనితా కరగ్రహణమొనర్చిన రసజ్ఞుఁడవని, వాగ్గేయకారకుఁడవని, - నిన్నెదఁ దలంచుచుఁ జిరంజీవుఁడవై యశోధ్వజమును నల్దిక్కుల నెగురవైచి తేజరిల్లఁ గలందులకు మదుపాస్యదైవతంబగు లలితను గోరుచున్నాఁడను.

నీ శ్రేయోఽభిలాషి
(సం) కోన వేంకటరాయశర్మ
౨౬-౧-౧౯౫౭

# వినయాంజలి

శ్రీ శక్తిస్త్రీస్వరూపిణి తద్భావనాభావితమగు హృదయముతో నస్మద్ జననీజనకుల నాదోపాసనా ఫలమే నాకీ సంగీత సాహిత్యములందలి యభిరుచికి హేతువు. అయ్యది ప్రాక్తనవాసనా విశేషము చేతనూ, సద్గురువుల యాశీర్వాదఫలముచేతనున్నూ నాకుఁ గలిగిన శాస్త్రీయ సంగీతమునందలి యీషదభినివేశమే యువసాహసమున నేడీగ్రంథరూపమును దాల్చినది.

కేవలకైవల్య కాములు, సర్వోత్తమ సంస్కృతీ సామ్రాజ్యాధినేతలు, భారతులు నను భారతీయ సంయమిసత్తములాదిగా మన పూర్వులెల్లరు సర్వవిద్యలను, నెల్లకళలను, సామాజికాభిరుచిని గల్పించుచూ, తదన్వేషణమున కంకితమొనరించిరి. తత్ఫలమే నేడు మన ప్రాచీనవిజ్ఞానమును కించిత్తైననూ, వినిగాని, కనిగాని ఇయ్యది మా విజ్ఞానము, మా సంస్కృతి, మానాగరికత యని గర్వించుటకు గారణమగుచున్నది.

అట్టివరవడిలోనే పరతత్వస్వరూపుడగు శ్రీ త్యాగరాజు మొదలైనవారు లలితకళలలో నత్యుత్తమస్థాన మలంకరించిన సంగీతకళను అనువగు సాహిత్యసంపదతో విస్తరింపజేసిరి. సంగీతమనునది కళ, మఱియు, శాస్త్రమును నగుటచే అవ్యక్తానందమున కాటపట్టై భుక్తి ముక్తుల కాలవాలమైనది. కనుకనే మిక్కిలిగ పండిత పామరాదరణము నకు పాత్రమగుచున్నది.

కర్ణాటక సంగీతమునందు జనకరాగములని మేళకర్తలనియూ ప్రఖ్యాతిగొన్న డెబ్బదిరెండు రాగములకునూ, నీ కృతులమూలమున నొక యాకృతి నొనరించి యీ సంపూర్ణరాగములను సంపూర్ణమగు ప్రచారములోనికి దెచ్చుట కుద్యమించితిని.

తొల్లి యీ జనకరాగములందు కొన్ని కృతులే ప్రచారములో నున్నవి. 72 రాగములలోనూ, కృతులున్నప్పటికి యవిరాగ మాలికలగాను, యన్యభాషలోనూ, యున్నందున పూర్ణమగు ప్రచా

రము యీ రాగములకు లేకుండెను. అంతియగాక నీరాగములు సంపూర్ణ సంపూర్ణము లగుటవలననూ, ద్వాదశశ్రుతి లక్షణ లక్ష్య భూతములగుటంజేసి, గాయకుడు యీరాగములందు స్వరసంచారాదుల నలవరచుకొన్నచో యెట్టివక్రరాగములందైనను యవలీలగా రాగాలాపన స్వరప్రస్తారములను జేయుటలో మనోధర్మ సంగీతమును విస్తరింపజేయ గలుగుదురనుట నిస్సంశయమని నాయభిప్రాయము.

పై నాయుద్యమము, చురుకుగా సాగుటకును, నన్ని శాస్త్రీయ సంగీతమహాపథమున వాంఛునిగా నొనర్చి యనన్యమగు కరుణతో, నపారమగు శిష్యవాత్సల్యముతో, యనవరతమునూ దీవించి నాయీకృతులు, వర్ణములు, మొదలగువానిని నేనునూ, మఱియు నితరగాయకులు, పాడుచుండగా వినుచు, హస్తమస్తక సంయోగమున యానంద భాష్పములతో నన్నాశీర్వదించుచు, యాకస్మికముగ కైవల్యసామ్రాజ్య మధిష్ఠించిన యస్మత్ సద్గురువర్యులు, గాయకసార్వభౌములు, నగు శ్రీశ్రీ పాలపల్లి రామకృష్ణయ్య పంతులుగారికి సాంజలి బద్ధుడనై సదా కృతజ్ఞతతో వందనశతంబుల నర్పించుచుంటిని. శ్రీ వారి లిఖిత పూర్వకాభిప్రాయమునకే యాకస్మికాంతరాయము గల్గినందుల కెంతయూ విచారించుచున్నాను.

బాల్యమునుండియు, నా పురోభివృద్ధికారకులై శ్రీ దుర్గా సంస్థానమున నాకొకస్థానమిచ్చి నాక్షేమము ననుక్షణమునూ కాంక్షించుచూ, శ్రీ దుర్గాదేవియనుగ్రహమునకు బాత్రునిగాజేసి యీ గ్రంథముద్రణమున, సంపూర్ణమగు బాధ్యతతో, పూర్ణముగ ద్రవ్యసహాయమొనర్చిన శ్రీ శ్రీ దుర్గామల్లేశ్వర దేవస్థానము వారికి సదా నాహృదయపూర్వక కృతజ్ఞతాభి వందనముల సమర్పించుచున్నాను

---

ఈ గ్రంథమును పూర్తిగా నవలోకించి యాదరముతో తొలిపలుకు వ్రాసి, నాకీ గీర్వాణభాషాభ్యాసమునకు ప్రథమమున యాచార్యులగు అవధానిశిరోమణి, మహామహోపాధ్యాయ మధ్వ శ్రీ కాశీ కృష్ణాచార్యులవారికి నమస్సుల నర్పించుచున్నాను.

అతివాత్సల్యమున యకారణ కరుణా కృతచేతస్కులై ఆంధ్ర గీర్వాణములందు, నాకు కవిత్వలక్షణాదులయం దభినివేశమొనర్చిన విద్వాన్ శతావధాని, బంధగర్భకవి సామ్రాట్ బ్రహ్మశ్రీ భమిడిపాటి అయ్యప్ప శాస్త్రిల వారికి నమస్కారముల నర్పించుచున్నాను.

సంస్కృతాంధ్రాంగ్లాది బహు భాషలయం దపారమగు కవితా శక్తిచే విశాలమగు యశ మార్జించి "ఆంధ్రిశాగూ" రని యను రూపమగు ప్రత్యేక నామముగల్గి ఉద్దండ ప్రతిభాశాలురగు కవిసామ్రాట్ బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణ మహోదయులు, నా గ్రంథము నామూలాగ్రముగ పరిశోధించి యమూల్యమగు పీఠికను వ్రాసియిచ్చి నందులకు, కృతజ్ఞతతో ప్రణమిల్లుచున్నాను.

మఱియు, మహామహులు, రసికవరేణ్యులు ప్రఖ్యాతకవి పండితులు యీ గ్రంథముపై యభిప్రాయము లొసంగి నందులకు కృతజ్ఞతతో నమస్కరించుచున్నాను.

ఈ గ్రంథ ముద్రణములో బహుశ్రద్ధజూపి, అచ్చొత్తించిన వెల్కం ప్రెస్ ప్రొప్రైటర్లను, గుంటూరు వాస్తవ్యులు నగు శ్రీ జంధ్యాల వెంకటప్పయ్య శాస్త్రి గారికి నమస్కారములు.

ఈ గ్రంథ ప్రభవ హేతువును పైన వివరించు కొంటిని. అందుల కనుగుణముగ నుత్సాహముతో గాయక వరులు వీటిని పాఠముజేసి ప్రాచుర్యము దెచ్చుచు నా యభిలషితము నెరవేర్చు చున్నందులకు యానందించు చున్నాను. ఇంకను నేనీ సంగీత సాహిత్యముల కితోధిక సేవజేయ గలందులకు మహాత్ములెల్లరు నన్నాశీర్వదించుచు నా పరమేశ్వరియు నాకు చేయూత నొసంగి రక్షింప వేడుచున్నాను.

## గ్రంథస్థ సంకేత వివరములు

మాత్రాకాలము:— ఈ మాత్రాకాల విషయమున, సాధారణముగ, కామాలు (,) చుక్కలు (.) తో గాకుండగ యాకెలతో తెలుపబడినది.

ఉ:- సా', యనగా తారషడ్జమమునకు నాల్గు (;) మాత్రలకాల ప్రమాణమని యెంచవలెను.

72 మేళకర్తలకును, చక్రమునకు 6 సంజ్ఞలచొప్పున 12 చక్రములు గలవు.

ద్వాదశచక్రనామములు 1 ఇందు, 2 నేత్ర, 3 అగ్ని, 4 వేద, 5 బాణ, 6 ఋతు, 7 ఋషి, 8 వసు, 9 బ్రహ్మ, 10 దిశి, 11 రుద్ర, 12 ఆదిత్య, అందు ప్రతిచక్రమునకు గల 6 రాగములకు, 1 పా, 2 శ్రీ, 3 గో, 4 భూ, 5 మా, 6 షా, లను 6 నామములు,

ఉ:- బ్రహ్మ-భూ, యనియున్నపుడు 9వ చక్రమున 4 గవ రాగము (రామప్రియ) యని యెఱుంగవచ్చును. ఇట్లే ఆయా కృతుల పైనున్న యక్షర సాంకేతికములను గ్రహింపనగును.

ఇట్లు విధేయుడు,

(సం.) మంగళంపల్లి బాలమురళీకృష్ణ

# కృతుల పట్టిక

# గురుస్మృతి

## కృతి

హంస వినోదిని - ఆది.

29 మేళకర్తయగు ధీరశంకరాభరణ రాగంలో జన్యం

ఆ స రి గ మ ధ ని స | షాడవ
అ .. స ని ధ మ గ రి స | షాడవము.

ప|| గురుని స్మరింపుమో మనసా స|| ద్గురుని

అ|| గురుతరభక్తితో జ్ఞానార్ద్రవగుచు |
పరమ సుశీలుడై కరుణాకరుడౌ, స|| ద్గురుని

1. చ|| గాయక సార్వభౌమాది, ఘనబిరుదాంకితుడౌ, గుణనిధిని||
శ్రీయుతుడై సదా శిష్య సమేతుడై,
శ్రేయమొసగు శ్రీరామకృష్ణ స|| ద్గురుని

2. చ|| సకలాగమ నిగమసార సంయుత, సంగీతసాధనతో సద్గతికై
సదమల ధర్మ నియమ సంయుతుడై |
సదా మురళీగాన విలోలుడౌ స|| ద్గురుని

ప|| . . ద నీ ద మా మ మ గ రి స రి గా | గా గ మా దా దా స ని ద మ||
గు రు ని స్మ రిం . . పు . మో . మ న సా స . . . .

ద ని } | గా గా మా గ మ దా ద ర్ి స ని ద మ
. . } ద్గు రు ని - మ న సా . . .

ద ని } స ర్ి స ని స . . . . .
. . } గు . రు . ని స్మరింపుము -

అ|| | దా స ని ద మ దా దా స ని సా సా | సా సా స రి గ మ గా గ రి గ రి సా |
గు రు . త . ర భ . . క్తి తో . జ్ఞా నా . . ర్ధ వ . గు . చు

సా | మ ద ని స నీ సా | సా
గు రు త ర భ . . . క్తి తో | . జ్ఞా

ఓమ్.

# (జనకరాగ)

# కృతిమంజరి

## పూర్వభాగము

---

### గీతము

### I విజయ సరస్వతి—చ॥ ఏక:

57 వ మేళకర్త యగు సింహేంద్రమధ్యమజన్యం

ఆ - స గ మ ప ద ని స̇.
అ - స̇ ని ద మ గ రి స.

స గ రి స । రి స ని̣ స । గ రీ స । గ మ ప ద । మ గ గ మ । గ రీ స ।
శ్రీ . నశే । . శ చి . । త్ప్రికాశ । శ్రీ . . త్రి । పు ర సు ం । ద రే శ ।

గ మ గ ప । దా నీ । ద ద మ గ । మా గ రి । స గ మ ప । ద ద మా ।
చ ం ద్రి క । శాభూ । షితో . త్త । మా ం గ । చ ం . . । ద న లి ।

గ మ గ మ । పా పా । గ మ గ ప । ప ద ద మ । ప ద ని స̇ । ని ద ని ద ।
త్త . . శు । భాంగ । భృ ం . గా । . ది మ త । మా . ము . । ద్ధ ర హే . ।

మ గ రీ । రి స ని̣ స }
స్వా . మిన్ । జయ జయ } జావడ.

ప ద మ ప । ద ని స̇ ని । ద ని ద మ । ప ద నీ । ని స̇ గ̇ రి̇ । స̇ గ̇ మ̇ గ̇ ।
వి వి ధ మ । కుటమణి । దీ . పి త । చరణా । కుం ద కు । సు మ ని భ ।

మా̇ మ̇ గ̇ । గ̇ రి̇ సా̇ । స̇ గ̇ రి̇ స̇ । ని స̇ ని ద । మ మ ప ద । మ గ మ మ ।
దే . . । హా . యా । నం . ద । ము ర ళీ . । ర వ స . । మ్మో . . ద ।

ప ద ని స̇ । ని ద ని ద । మ గ రీ । రి స ని̣ స }
మా . ము . । ద్ధ ర హే . । స్వా . మిన్ । జయ జయ }

---

## ఘనరాగ గీతము

### వరాళి—చ॥ రూపకమ్

39 వ మేళకర్తయగు ఝాలవరాళిజన్యం

ఆ — స గ రి గ మ ప ద ని స̇.
అ — స̇ ని ద ప మ గ రి స.

గ గ రి రి సా । గ గ రి గ మ ప । ద ద ప మ గా । మ మ ప ద ప మ ।
శి వ ల లి తే । సు జ న . క . । ల్పా . ల . తే । శీ . . . త న ।

ప ద ప మ పా । ప ద ని స̇ ని ద । ని ద ప మ పా । గ రి గ మ పా ।
గ . బా . లే । శృ . తి . హి త । వా . గ్జా . లే । సు . శీ . లే ।

ద ద ప ద ని స̇ । రి̇ సా̇ ని ద । ని ద ప మ ద ద । మ గ గ రి రి స } జావడ
త వ ప ద భ . । క్తిం మే ము ద । మ తు లం దే . । హి మాం పా . హి }

స గ రి గ మ ప । ద ప ద ని సా̇ । స̇ గ̇ రి̇ గ̇ మ̇ గ̇ । గ̇ రి̇ స̇ రి̇ సా̇ ।
మృ గ మ ద తి ల । క సు ఫా . తే । వ రా . ళి వి త । ర ణ శీ . లే ।

రి̇ రి̇ స̇ ని దా । ని స̇ ని ద పా । ద ద ప ద ని స̇ । రి̇ సా̇ ని ద ।
ము ర ళీ . గా । న వి లో . లే । త వ ప ద భ . । క్తిం మే ము ద ।

ని ద ప మ ద ద । మ గ గ రి రి స }
మ తు లం దే . । హి మాం పా . హి }

---

# తానవర్ణం

## 1. రామప్రియ — ఆది

ప॥ చలము జేసిన నీకేమి
ఫలమురా గోపాల బాల ।
అ॥ కలనైన మరువని వైన మెరుగవా ।
ఆలసింప సొంపా మురళీధర ।
చ॥ నిరుపమ గుణ తేజ సకలేశ కరుణాకర ॥

ప॥ సా సా స ని దా ద ప ద ని స ని దా । ద ప ద నీ ద ప ని ద ద ప మా ప ద ని
చ ల ము . . జే . . . సి . . । న . . నీ . కే . . . . మి . . .

సా సా స ని ద ని పా$^{4}$ మ ద ప మ । గ రి స రి గా గా గ మ పా ద ప ద ని
ఫ ల ము . . . రా గో . . . । . . పా . . ల బా . . . ల . .

అ॥ సా పా ని ద ప మ గా ప మ గ రి సా । స రి గ రి గ మ పా మ ప ద ప ద ని సా
క ల నై . . . న మ . రు . వ । ని . వై . . . న మె . రు . గ . వ

స రి గ రి సా స ని స ని దా ద ప ద ని । సా$^{4}$ రి స ని ద స ని ద ప మ ప ద ని
ఆ . . . ల సిం . . ప సొం . . । పా ము . ర . ళీ . . . ధ . ర .

### ముక్తాయి స్వరము

సా రి గ రి స నీ సా ని ద ప మ గ రి । సా రి గ రి గ మ గ । మ ప ద ప మ ప ద ని॥
స రి గ రీ స ని స రి సా ని ద ప ద ని। సా ద ని సా ప ద । ని సా గ మ ప ద ని॥చలము॥

చ॥ ని సా నీ$^{3}$ దా ప దా పా$^{3}$ మా । గ రీ గా మ పా$^{4}$ ని ద ప మ ప ద
ని రు ప మ గు ణ తే జ । స క లే . శ క రు ణా . క ర

1 సా$^{6}$ సా నీ దా పా దా । నీ$^{6}$ దా । పా మా పా దా॥ ॥నిరుపమ॥

2 స సా ని ద ప మ ప ని ద ప ద ప మ గ రి । స సా రి గ మ ప ద । ని సా స ని ద ప ద ॥నిరు॥

3 సా రి స స రి స సా ని ద ప స ని ద ప । మ ని ద ని ప ద మ ప। ద ప మ గ మ ప ద ని॥
ని ద ప స ని ద ప మ గ మ ప ద ని స రి గ । మ గ రి సా రి స ని । ద పా మ గ మ ప ద ॥
॥నిరు॥

4 దా$^{6}$ ని ద ప ద ని ప ని ద ప మ । పా$^{3}$ దా ప మ గ । రి ని ద ప మ రి స ని॥
ద నీ ని స ని ద ప స ని ద ప ని ద ప మ । ప ద ని ప ద మ ప గ । మ రి గ మ ప ద ని స॥
దా ని స రి గ రి స ని రి స ని ద ప ద ని। స ద ని ప ద మ ప ద । ని ద రి స ని ద ప గ॥
మ ప ద ని స రి గ రి గ మ గ రి సా ప ద। ని ద రి స ని ద పా స రి గ రి గ మ ప ద॥నిరు॥

---

# తానవర్ణము

## 2. తోడి — ఆది

8 వ మేళకర్తయగు హనుమత్తోడి జన్యము
షాడవ, షాడవము

ఆ - స రి గ మ ద ని స.
అ - స ని ద మ గ రి స.

ప॥ సరగునగావుము వరగుణనిలయే।
కరిమాచలవాహనే సదయే।

అ॥ కరుణారసపూరిత హృదయే।
మురళీగానసుధారసప్రియే।

చ॥ నీగరిమగని నీ దరిని జేరితిని సదాసామనిగమమోదిని॥

ప॥ సా స నిదని సా ని రి స నిద మ ద ని । స రి స నిద మ గ రి। స రి గ రి గ మ ద ని
స ర . గు . న గా . . . వు . ము . । వ . ర . గు . ణ . ని . ల .యే . . .

ని రి ని ద ద ని ద ద మ గ మా గ రి గా। రి గ మా గ మ దా ।మ ద నీ ద ని సా
క . రి . మా . . . చ . ల వా . .।హ . . నే . . స . ద యే . .

అ॥ సా రి స గ రి స ని రి స రి ని ని ద దా ; ద ని ద రి స ని ద మ। ద ని స రి గ రి రి
క రు . ణా . . . ర . స . పూ . . । రి . . . త . . .। హృ . ద . యే . .

గ మ గ రి స గ రి స ని రి స ని ద మ ద ని।సా³ రి స ని ద మ। గ రి స రి గ మ ద ని
ము . ర . ళీ . . . గా . . . న . సు .।ధా . ర . స . . . ప్రి . యే . . .

### ముక్తాయి స్వరము

సా³ రి ని ద ని సా నీ దా మ గ రి । సా³ రి ని ధ గ రి! మ గ ని ద గ మ ద ని॥
స రి స ని రి స సా ని ద మ ద ని గ రి స। ని దా ని రి స ని ద।మా గ రి గ మ ద ని ॥సర।

చ॥ నీ⁴ గ రి మ గ ని నీ ద రి ని సా । రి స ని స ద ని సా మ ని గ మ గా రి స
నీ గ రి గ మ ని నీ ద రి ని జే । రి తి ని స దా . సా మ ని గ మ మో ది ని

1 గా⁶ మా⁴, మా దా, దా । మా నీ, గా దా⁴ ధా రీ⁴ ॥ని॥

2 రీ గ రి గ మ గ మ ద మ ద నీ ద ని స̇ । ని రి̇ సా̇ స̇ ని ద మ । గ మా గ ద మ గ రి ॥నీ॥

3 గా$^{3}$ గ మ గ గ మ గ గ రి స రీ$^{3}$ రి । గ రి రి గ రి రి స ని̣ సా$^{3}$ స ధ̣ ని̣ స రి
ని̣ సా మ గ దా మ స̇ నీ ద గ̇ రి̇ స̇ ని । సా̇ సా̇ ని ద ని దా ద మ గా గ రి స ॥నీ॥

4 సా̇$^{4}$ రి̇ గ̇ రి̇ స̇ ని ద ద ని ద మ గ రి । సా$^{4}$ గా రి గా స రి గా మ ద ని॥
స̇ స̇ రి̇ స̇ ని ద ని స̇ స̇ ని ద మ ద ని స̇ రి̇ । స̇ గ̇ రి̇ రి̇ స̇ ని ధ ని సా̇$^{3}$ గ రి̇ స̇ ని ద॥
స̇ ని స̇ మ̇ గ̇ రి̇ స̇ ని . ని గ̇ రి̇ ని ద మ ద ని । స̇ స̇ రి̇ గ̇ రీ̇ ని ద ని దా మ గ మ ద ని॥
సా̇ రి̇ గ̇ రి̇ స̇ ని ద గ̇ రి̇ స̇ ని ద ని సా̇$^{3}$ రి̇ స̇ ని ద ని సా̇ $^{3}$ స̇ ని ద మ గ రి స ॥నీ॥



ఓమ్.

(జనకరాగ)

# కృతిమంజరి

## పూర్వభాగము

---

### ఇందు - పా

### 1. కనకాంగి—చ॥ రూపకమ్

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | | | మ | | ప | ద | ని | | | ṡ |

శ్రీశపుత్రాయ నమోస్తుతే, విఘ్నవినాశాయ, విభవప్రదాయ॥శ్రీశ॥

అ॥ వాశిష్ఠాది మునిపుంగవ పూజితాయ,
వరేణ్యాయ, మహాబలాయ,
పాశాంకుశధరాయ, లంబోదరాయ, అంబాసుతాయ,
వర మురళీ గానసుధారసానుభవాయ. ॥శ్రీశ॥

ప॥ సా4 రీ గా మా పా । పా దా ప మ గా4 రీ ।సా12
శ్రీ శ పు . త్రా । . య న . మో స్తు । తే

రీ4 రీ రీ రీ4 । గ మ ప ద ప మా ప గా రి స
విఘ్నవినా । శా . య వి భ వ ప్ర దా . య ॥శ్రీశ॥

అ॥ సా రి గా3 మా పా దా । నీ సాం రీ4 సాం రీ । గాం4 గాం రీ4 సాం
వా . శి ష్ఠా . ది । ము ని పుం గ వ । పూ జి తా య

నీ నీ4 దా4 పా । మా పా4 దా రీ4
వ రే ణ్యా య । మ హా బ లా

రీ సాం సాం ని ని రి సాం ṡ । గాం గాం రి రీ ṡ ṡ ని నీ
యపా శాంకు శ ధరా య । లం బో దరాయ అం బా

ద దా ప ṡ ṡ రి ṡ సాం నీ । ద ద పా ద పా మ గ రీ స
సు తాయ వ ర ము ర ళీ గా । న సు ధా ర సా ను భవాయ ॥శ్రీశ॥

---

## ఇందు - శ్రీ

## 2. రత్నాంగి = చ॥ రూపకమ్

| స | రి | గ | | | మ | | ప | ద | | ని | | సం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

ప॥ శ్రీ గురుం చింతయామ్యహం, సతతం।
శ్రీ త్యాగరాజం, రామబ్రహ్మ సుపుత్రం॥ ॥శ్రీ॥

అ॥ యోగివరం, ధీనిధిం, సంగీతరసజ్ఞం।
త్యాగయోగ సమరసం సహృదయం సుమధురవచసం॥ ॥శ్రీ॥

చ॥ వాల్మీకి మునివర్యాంశ, సంభూతం, సర్వజ్ఞం, గాయకజన।
భాగధేయం, మురళీ గానలోలం॥ ॥శ్రీ॥

ప॥ సా⁶ నీ సా⁴ । సం ని నీ ని ద ద ప పా మా । పా⁸ మ ప ద ని
శ్రీ గు రుం । చిం . త . యా . . మ్య । హం స త తం

,, । ,, । పా¹²
శ్రీ గు రుం । చిం . తయా మ్య । హం

సా⁴ రీ గా⁴ మా । ప ద నీ దా నీ సా⁴ । ని రి సా సం ని ద మ పా ద ని
శ్రీ . త్యా గ । రా . . . . . జం । రా . మ బ్ర . హ్మ సు పు త్రం ॥శ్రీ॥

అ॥ పా దా పా ద ని సా⁴ । సం ని రి సం ని ద పా దా⁴
యో . గి వ . రం । ధీ . . . . . ని ధిం

ద ని సా రీ గా రీ సా । దా నీ⁴ సా⁶
సం . . గీ . త । ర స జ్ఞం

పా ప మా ప మ గ రి సా స । మ మ మా ద ప ద మ ప ద నీ
త్యా గ యో గ స మ ర సం స । హృ ద యం సు మ ధు ర వ చ సం ॥శ్రీ॥

చ॥ రీ సా స ద ని సా సా సం । పా ద ని సా మ ప ద ని సా
వా ల్మీ కి ము ని వ ర్యాం శ । సం భూ . తం స . ర్వ . జ్ఞం

రీ సం ని ద ప మ గ ద పా ప । ప మ గ మా ద ప మ పా ద ని
గాయక జ న భా . గ ధే య । ం ము ర ళీ గా . న లో లం ॥శ్రీ॥

---

## ఇందు - గో

### 3. గానమూర్తి = చ॥ త్రిపుట

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | | | మ | | ప | ద | | | ని | స |

ప॥ పాహి జగదీశ్వర, పురహార, మాం
పాహి, సకలలోకాధార, శంకర॥ ॥పాహి॥

అ॥ దేహి తవ చరణం, మమ శరణం
దివ స్తుతి సేవితం, భవ భయ హారణం॥ ॥పాహి॥

చ॥ పరమపురుష, సకలభువనాధార
పరమానంద స్వరూప, శంభో
పరాత్పర, పాపహార, గానమూర్తే
మురళీభక్తవ శంకర, మామవ॥ ॥పాహి॥

ప॥ సాం3 నీ3 దా మా3 దా3 నీ । సాం6 సాం సాం రీ సాం4
పా హి జ గ దీ శ్వ । రా పు ర హా ర

సాం రి రి స ని । సాం సాం రి రి స ని ద మ
పా . హి . . జ గ దీ శ్వ । రా పు ర హా . ర . మాం

ప ద ని సాం ని దా పా మా మ ప ద ప । ప ప మ గా3 మా5 మా మ గ మ
. . . పా హి స క ల లో . . . । కా . . ధా ర శం క ర॥ .

ప ద ని సాం ని దా మా3
. . . పా హి జ గ దీ శ్వ రా ॥పాహి॥

అ॥ ...సాం స స రి రి స ని సాం3 రీ । గాం6 స రి గాం3 రి రీ సాం
దే హి త . వ . . చ ర । ణం మ . మ శ ర ణం

...సాం స రి గ రి స ని ,, । ,, గాం ప మ గ రి రీ సాం
దే హి త . వ . . చ ర । ణం మ మ . . శ ర ణం

. . స సా స సా ని రి స ని దా పా । పా మ దా ప మా గా మా ప ద నీ } ॥పాహి॥
ది వ స్తు తి సే . . . వి తం । . భ వ భ య హ ర ణం .

చ॥ . . ని సా ని దా పా పా$^{3}$ ప దా । నీ$^{3}$ ని దా పా మా ద ప మ గ మా }
ప ర మ పు రు ష స క । ల భు . వ నా . ధా . . ర

. . ప పా మా$^{5}$ గా$^{3}$ రి సా । సా గా$^{4}$ మా పా$^{3}$ ద పా$^{3}$ ద పా$^{4}$ }
ప ర మా నం ద స్వ । . రూ ప శం . . భో

సా రి రి స ని స రి గా$^{3}$ రి స రి గా । గా గా ప మ గా రీ రీ$^{4}$ సా }
ప . రా . . త్ప . రా పా . . ప । హ ర గా . . న మూ ర్తే

. . స స సా$^{4}$ స రి స ని దా పా । పా మ దా ప మా గా మా ప ద నీ } ॥పాహి॥
ముర ళీ భ . . . క్త వ । . శం క ర మా . మ . వ

## ఇందు - భూ

### 4. వనస్పతి = చ॥ త్రిపుట

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | | | మ | | ప | | ద | ని | | స |

ప॥ ఈశ్వరి, జగదీశ్వరి, మహేశ్వరి, మాంమవహే, అంబ॥ ॥ఈశ్వరి॥

అ॥ ఐశ్వర్య ప్రదాయిని, అంబ, మునిజన హృదయ నివాసిని।

హర్ష భాషిణి, సుజనపోషిణి, శూలధారిణి, పాపమోచని॥ ॥ఈశ్వరి॥

చ॥ కమనీయాకృతే, గిరిపుత్రే।

రమణీయగేయే వనస్పతి ప్రియే। ॥ఈశ్వరి॥

2 కరుణా కలితే, కోమలగాత్రే।

మురళీగాన రసికే, మాం పాహి॥ ॥ఈశ్వరి॥

ప॥ నీ$^{6}$ పా దా$^{4}$ మా మా । పా$^{6}$ దా మా$^{6}$ గా

ఈ శ్వ రి జ గ । దీ శ్వ రి మ

గా$^{6}$ రీ సా$^{6}$ స రి । గా$^{6}$ మా పా$^{3}$ మ పా దా

హే శ్వ రి మా . । మ వ హే . అం బ

,, । పా ని ద పా దా మా$^{6}$ గా

ఈ శ్వ రి జ గ । దీ . . . శ్వ రి మ

,, । గా$^{6}$ మా ప ద ని ద ప మ ప ద

హే శ్వ రి కృ . । పా క రి . . . అం బ . ॥ఈశ్వరి॥

అ॥ సా$^{6}$ నీ దా నీ పా ద ని । సా$^{6}$ నీ సా$^{4}$ దా నీ

ఐ శ్వ ర్య . . ప్ర . । దా యి ని అం బ

సా$^{6}$ నీ ద ని స ని ద ప ద ని । ,,

ఐ శ్వ ర్య . . . . . ప్ర . । దా యి ని అం బ

రీ$^{3}$ సా$^{3}$ నీ$^{3}$ దా$^{3}$ పా దా । నీ సా$^{4}$ నీ$^{4}$ దా పా$^{4}$
ము ని జ న హృ ద । య ని వా సి ని

సా రి సా రి గా రి సా$^{4}$ । ని రి సా స స ని ద పా దా$^{4}$
హా . ర్ష భా . షి ణి । సు జ న పో . . . షి ణి

ద ని స రి సా నీ$^{4}$ దా పా మా । ప ద ని ద ప మ గా$^{4}$ మా పా దా
శూ . . . అ ధా రి ణి . । పా . . . ప . మో చ ని . ॥ఈశ్వరి॥

చ॥ సా నీ దా$^{4}$ పా మా నీ దా । పా$^{4}$ మా గా రీ$^{4}$ సా$^{4}$
క మ నీ యా . . కృ । తే గి రి పు త్రే

స రి గా మా$^{4}$ పా దా నీ సా । సా నీ దా మా పా దా నీ$^{4}$
ర . మ ణీ య గే . యే । వ న . స్మృ తి ప్రి యే ॥ఈశ్వరి॥

2 సా సా సా$^{4}$ నీ దా నీ$^{4}$ । దా పా దా దా పా మా పా$^{4}$
క రు ణా క లి తే । కో . మ ల గా . త్రే

మా గా మా$^{4}$ పా$^{4}$ దా నీ । దా పా$^{4}$ ని దా మ పా దా రి స
ము ర ళీ గా న ర । సి కే మా ం . పా . హి . ॥ఈశ్వరి॥

---

## ఇందు - షా

### 6. తానరూపి = చ॥ త్రిపుట

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | | | మ | | ప | | | ద | ని | సం |

ప॥ శ్రీరామం, సదా, భజేహం।
శ్రితజనపాలకం, సకలదేవపూజితం॥ ॥శ్రీరామం॥

అ॥ శ్రీరమానాయకం, ధీరవరనాయకం।
సూరిజనభావితం, సుందరహాసవదనం॥ ॥శ్రీరామం॥

చ॥ తరణికోటిప్రకాశం, మురళీగానవిలాసం।
పరమమునివర మనోహారం, త్యాగరాజ సన్నుత శుభచరితం॥
॥శ్రీరామం॥

ప॥ సా$^{6}$ నీ సా ని స రి స ని స । దా$^{3}$ ప పా$^{3}$ మ సా$^{4}$ దా నీ
శ్రీ రా . మం . . . స । దా . . భ జే హం

రి రి గ రి రి స ని ని స రి స రి సా$^{4}$ । సా నీ దా పా$^{3}$ మ పా$^{3}$ ద నీ
శ్రి త జ . న . పా . . . ల . కం । స క ల దే వ పూ జి తం ॥శ్రీరామం॥

అ॥ పా$^{3}$ ప మా$^{3}$ గ రీ$^{3}$ రి సా$^{4}$ । సా$^{3}$ ని గా గా గ మ ప మ పా$^{4}$
శ్రీ ర మా . నా య కం । ధీ ర వ ర నా . . య కం

దా$^{3}$ ప సా నీ సా$^{3}$ రి గ రి సా$^{4}$ । సా$^{3}$ ని దా పా$^{3}$ మ గా మ ప ద ని
సూ రి జ న భా . . వి తం । సుం ద ర హా స వ ద . నం ॥శ్రీరామం॥

చ॥ . . ప ప పా మ గ రి సా ప మా మా । మ గ మా పా ప మ పా$^{4}$ ద దా ప
త ర ణి కో . . టి ప్ర కా శం । ము ర ళీ గా న వి లా స ం .

ప ప మ ప మ ద ప ప స ని స రి సా$^{4}$ । మా గ పా మ దా ప మ గ మ ప ద ని
ప ర మ ము ని వ ర మ నో . . హా రం । త్యా గ రా జ స న్ను త శు భ చ రితం
॥శ్రీరామం॥

---

## నేత్రి - పా

### 7. సేనాపతి = చ॥ త్రిపుట

| స | రి | | గ | | మ | | ప | ద | ని | | | ṡ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

ప॥ జాలమేల, రఘుపతే, శ్రీపతే।
నీలకంఠ సన్నుత, సన్నతే॥ ॥జాల॥

అ॥ నీలవర్ణ దినకర, కులపతే।
పాలించు, శ్రీరామ, భూపతే॥ ॥జాల॥

చ॥ కరుణాకటాక్ష, ఏల యుపేక్ష।
దుష్టశిక్షక, శిష్టరక్షక।
సరసిజాక్ష ఓ, కరిరక్షక।
సుజనపక్ష, మురళీ భక్తరక్షక॥ ॥జాల॥

ప॥ పా మ గ రి స ని ని । గ గా గ మ పా మ గా
జా ల మే . ల ర ఘు। ప తే శ్రీ . . ప తే

గ ద ప మ గ రి స ని ని । గ గా ప మ గా రి స రి గ మ
నీ . ల కం . ఠ స . । న్ను త స . . న్న తే . . .

" " గ మ పా ద ప మా ప మ గా
జా ల మే ల ర ఘు । ప తే శ్రీ . . . . ప . . తే

" "
నీ ల కం ఠ స । న్ను త స న్న తే ॥జాల॥

అ॥ ప ద ని ద పా ద ప మ । ద దా ని ṡ ని సా
నీ . . ల వ ర్ణ ది న । క ర కు ల ప తే

## నేత్ర - శ్రీ

### 8. హనుమత్తోడి = ఖం॥ త్రిపుట

| స | రి | | గ | | మ | | ప | ద | | ని | | స |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

ప॥ త్యాగరాజ గురుం భజేహం।
తామసాది గుణరహితం తత్వజ్ఞం॥ ॥త్యాగ॥

అ॥ త్యాగయోగవిదం, యతివరం।
సద్గతి ప్రదాయకం, సద్గుణశీలం।
సరస మురళీ గానలోలం॥ ॥త్యాగ॥

ప॥ పా4 మా గా రీ సా సా రీ స్ని స రి । గా రీ రీ4 । సా3
త్యా గ రా . జ గు రు ం భ . । జే . . । హం

,, స గ రి స రి ని స రి । ,,
త్యా గ రా జ గు . రు ం . . భ . । జే హా ం

గమాపాదపమా మాపమగరిసా ,, । ,,
త్యా . గ . . . రా . . . జగురుంభ। జే హా ం

సా4 రీ గా4 మా పా దా నీ దా । పా4 మ గ రీ సా రీ గా మా
తా మ సా ది గు ణ ర హి । తం త . . త్వ . జ్ఞ ం

,, ప ద నీ దా నీ । సా4 రి స ని ద । ప మ గ మా ప ద ని
తా మ సా ది గు . ణ ర హి । తం త . . . । . . త్వ . . జ్ఞ ం .

సా రి స ని ద ప మ మా ప మ గ రి సా ,, । ,,
త్యా . . . గ . . రా . . . . జ గు రు ం భ । జే హా ం
॥త్యాగ॥

అ॥ . . . . పా4 దా పా4 ద ప ద మ ప ద । నీ దా దా నీ సా6 నీ
త్యా గ యో గ . . . వి . । ద ం . య తి వ

సా4 సా4 రీ సా4 సా సా నీ । దా పా6 పా4 సా నీ
రం స ద్గ తి ప్ర దా . । య కం స ద్గు ణ

దా పా మా4 మా దా నీ సా రీ సా। సా నీ దా మా పా4 దా నీ
శీ . లం । స ర స ము ర ళీ । . గా . న లో . లం ॥త్యాగ॥

---

## నేత్రి - గో

### 9. ధేనుక = చ॥ రూపకమ్

| స | రి | | గ | | మ | | ప | ద | | | ని | స |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

ప॥ రావయ్యా రామయ్యా, పాలింపవయ్యా॥ ॥రావయ్యా॥

అ॥ సేవకజన కామిత ఫలదాయక శ్రీనాయక॥ ॥రావయ్యా॥

చ॥ దీనబంధో, దయాసింధో।
నీరధిబంధన, నారదవందిత।
ధేనుకరంజక, ధీరచిత్త।
కరుణాకర, మురళీగానసుధాప్రియ॥ ॥రావయ్యా॥

ప॥ సా నీ దా పా మా । గా ప మ గ రి స ని
రా . వ . య్యా । రా మ . . . య్యా .

సా రీ గా మా । పా ద నీ ద ప ద ని
పా లిం ప । వ . . య్యా . . .

స రి గ రి స ని ద స ని ద ప మ । ప ద ని స ని ద ప మ గ రి స ని
రా . . . . . వ . . . య్యా . । రా . . . . . . మ . . . య్యా .

స రి గ మ పా ప మ ప ద నీ । స రి గ రి స ని ద స ని ప ద ని
పా . . . . లిం . . . ప । వ . . . . . య్యా . . . . . ॥రావయ్యా॥

అ॥ పా దా నీ నీ నీ నీ । దా నీ సా సా సా సా । సా ని స ని ద ప మ
సే . వ క జ న । కా . మి త ఫ ల । దా య . . క . .

" । " । స రి గ రి స ని ద స ని ద ప మ
సే వ క జ న । కా మి త ఫ ల । దా . . . . . య . . క . .

" । " । సా రీ గా రీ
సే వ క జ న । కా మి త ఫ ల । దా య క .

సాం నీ దా మా దా నీ }
శ్రీ . నా . య క } ॥రామయ్య॥

చ॥ పా$^{4}$ పా మా$^{4}$ మా । పా ప ప మ గ మా$^{4}$ మా }
దీ న బం ధో । ద యా . . . సిం ధో }

గ మ పా మా మ ప దా పా । పా$^{3}$ ద నీ దా దా$^{4}$ }
నీ . . . ర . . ధి । బ ం . ధ న }

పా$^{4}$ నీ ద ప మా$^{4}$ । మా మా పా$^{3}$ ద పా$^{3}$ ద పా$^{4}$ }
నా . ర . ద । వ ం . . ది . త }

పా దా నీ నీ నీ నీ । దా నీ సాం$^{6}$ సాం । సాం$^{6}$ రిం గాం రిం }
ధే . ను క ర ం । జ క ధీ ర । చి త్త . . }

సాం నీ దా మా దా నీ । రిం సాం నీ$^{4}$ దా$^{4}$ । పా గా మా$^{4}$ ప ద నీ }
క రు ణా . క ర । ము ర ళీ గా । న సు ధా ప్రి . య } ॥రామయ్య॥

---

